(విలుంఠనం పోటనం చ భ్రమణం పరిశీలనమ్
అదృశ్యస్థానం మోహనం చ భిన్నముల్లాసితం తథా)
చాపాదిలక్షణజ్ఞాన శస్త్రాణాం కరణం తథా
అస్త్రమంత్రపరిజ్ఞానాధ్యాయో, మదనిర్గమః
ఏవమాద్యా ధనుర్వేదే విద్యాః సంతి సహస్రశః.

అను నిరువదియెనిమిదియంశములు విస్తరింపఁబడెను. ధనుర్వేద సూత్రములు పరశురామకృతములై శాండిల్యభాష్యవివృతములై కేరళ దేశమున లభించుచున్న వని తెలియుచున్నది. అది నాలుగుపాదములు గలది ప్రథమము దీక్షాపాదము. రెండవది సంగ్రహపాదము. మూఁడవది సిద్ధిపాదము. నాల్గవది ప్రయోగపాదము. ధనుశ్శబ్దము సర్వప్రహరణముల వర్తించు. అది ముక్తాదిచతుర్భేదకము. ముక్త మనఁగాఁ జక్ర వజ్ర శల్య శక్తి తోమర కుంత పాషాణాదికము. అముక్త మనఁగా అంకుశ పాశ ఛురికా అసి గదా ముసల దండాదికము. ముక్తాముక్త మనఁ బాశ వాగురా రజ్జు శలయాదికము. యంత్రముక్త మనఁ జాప శతఘ్నీ శల్యక మంజూషా రథ్యవర్గాదికము. మహాస్త్రము సారముగా సర్వశస్త్రములలో ధనువు శ్రేష్ఠము. వింటి యంగములు బాణము అర్ధచంద్రము శిలీముఖము నారాచము మోచకము మొదలగునవి. అస్త్రము మంత్రాక్షరప్రతిలోమపఠితమై యధిదైవతప్రేరితమై యుండును. మంత్ర దేవతాభేదముల ననుసరించి, బ్రాహ్మ్యము ప్రాజాపత్యము వైష్ణవము రౌద్రము ఐంద్రము వారుణము ఆగ్నేయము వాయవ్యము సౌమ్యము (చంద్రదైవతకము) ఆదిత్యము దౌర్గము (దుర్గాదైవతకము) గాణేశ్వరము (వినాయకాధిదైవతకము) స్కాందము శాక్తేయము యామ్యము రాక్షసము నాగము గారుడము గాంధర్వము పైశాచము పైత్రము (పితృదైవతకము) పార్థివము ఆప్యము (జలాధిదైవతకము) తైజసము పావనము నాభసము (ఈ కడపటి యైదును పంచభూతములఁ గ్రమముగా స్తంభింపఁ జేయునట్టివి) సాముద్రము పార్వతము గాయత్రము త్రైష్టుభము మానుష్టుభము మొదలగునవి (కడపటిమూఁడును ఛందోదైవతకములగు మంత్రములు ప్రయోగములుగాఁ గలవి.) ఈయాయుధముల కధికారులు క్షత్రియులును బ్రాహ్మణులును దళనాయకులును నగుదురు. రథగజతురగపదాతులె వాని కధికరణములు. ఈసూత్రపాఠమునఁ బ్రథమపాదమున ధనుర్వేదాభ్యాసమునకు దీక్షాభిషేకశకునమంగల్యకరణాదికము వివరింపఁబడెను. రెండవది యగుసంగ్రహపాదమున సకలాస్త్రశస్త్రముల సంగ్రహవిధియు మూఁడవది యగుసిద్ధిపాదమున సంగ్రహించిన యస్త్రములకుఁ బునఃపునరభ్యాసమున మంత్రదేవతానియమజప హోమోపాసన క్రియలును విస్తరింపఁబడెను. మంత్రదేవత సకళ యనియు నిష్కళ యనియు నిరుదెఱంగులం బరఁగు. అదియు చేతనావత్త్వము, ఇచ్ఛావిగ్రహత్వము, యుష్టవ్యత్వము, తుష్టిమత్త్వము, ఫలదాతృత్వము, అను నైదుగుణములు గల దని పూజాహోమోపాసనాదుల సాధకులు నడపుదురు. షోడశోపచారములచే సిద్ధదేవత మిచ్ఛాఫలదానముచే సాధకుఁ డస్త్రప్రయోగము నొనర్చుట నాల్గవపాదమున విస్తరింపఁబడినది. శస్త్రప్రయోగమునకు ధనుర్వేదమున నియమములు గలవు— సామదానభేదములచే నసాధ్యుఁడయి దుర్వినీతుఁ డగుపురుషునిఁ గాని, బహుప్రజాసంహారకార్యము తత్పరకుఁనిఁ గాని, లోకకాలావస్థోచితముగాఁ గర్తృకరణశక్తి కనుగుణముగా నాపత్కాలమునను, సర్వదా ధర్మరక్షణమునను, దండము విధేయ మని శాస్త్రజ్ఞులు గ్రహించిరి.

ఈధనుర్వేదమున ముక్తాముక్తాదిచతుర్భేదములుగాక నియుద్ధ మని పంచమభేదమును దమవారిశాస్త్రజ్ఞులు గ్రహించిరి. తద్భేదము లన్నియు మల్లయుద్ధములలోఁ బ్రయోగింపఁబడునవి నాచనసోమనాథాదులు యుద్ధప్రక్రియల నుత్తరహరివంశాదుల వర్ణించియుండుట యెల్లరకు విదితమేగదా.

ధనుర్వేదదైవతస్వరూపమంత్రముల వైశంపాయనుఁడు తననీతిప్రకాశికలో నిట్లువర్ణించుచున్నాఁడు.

"చతుష్పాచ్చ ధనుర్వేదో రక్తవర్ణశ్చతుర్ముఖః
అష్టబాహుస్త్రినేత్రశ్చ సాంఖ్యాయనసగోత్రవాన్
వజ్రం ఖడ్గో ధనుశ్చక్రం దక్షిణే భుజమండలే
శతఘ్నీ చ గదా శూలం పట్టిసం వామబాహుషు
ప్రయోగకోటిరచితో నిత్యాంగో మంత్రకంపకః
ఉపసంహారవ్యాదయః శస్త్రాస్త్రైధయకుండలః
అనేకవర్గితాకారధూపాయణః పింగేక్షణః
జయమాలాపరివృతో వృషారూఢ స్స ఉచ్యతే.

అని స్వరూపప్రతిపాదనానంతరము—

తన్మంత్రం చ ప్రవక్ష్యామి వైరిజాలనికృంతనం
ఆత్మసైన్యస్య పక్షాణా మాత్మన శ్చాభిరక్షకమ్
ఆదౌ ప్రణవముచ్చార్య నమ ఇత్యక్షరే తతః
వదేత్ భగవద్పూర్వంతు ధనుర్వేదాయ చోచ్చరేత్
మాం రక్ష రక్షేత్యుచ్చార్య మమ శత్రూన్ వధేతి చ
భక్షయేతి ద్విరుచ్చార్య హుం ఫట్ స్వాహే త్యథోచ్చరేత్.
అహామేవ ఋషిశ్చాస్య గాయత్రీ చ్ఛంద ఉచ్యతే
మహేశ్వరో దేవతాస్య వినియోగో ఽరినిగ్రహే
ద్వాత్రింశద్వర్ణకమనుం వర్ణసంఖ్యాసహస్రకైః
జపిత్వా సిద్ధిమాప్నోతి రిపూంశ్చాత్యధితిష్ఠతి,

అని మంత్రలక్షణము నుపదేశించెను. ముక్తాదిభేదములు గాక ధనుర్వేదము మతాంతరముగా—

ఆదానం చైవ సంధానం విమోక్షః సంహృతి స్తథా
ధనుర్వేద శ్చతుర్ధేతి వదంతీతి పరే జనాః

అని బాణము చేతఁబట్టుటయు ఎక్కుపెట్టుటయు తెగగొని యేయుటయు లక్ష్యవేధము అన్ని నాల్గుక్రియల ముద్ద్యోతించువిభాగములు గల వని కొందఱూహింతురు. మతిఁ గొందఱు శస్త్రము ప్రతిశస్త్రము అస్త్రము పరమాస్త్రము-అని చతుర్విధముగా విభజించిరి. వసిష్ఠసంహితయు శార్ఙ్గధరుని వీరచింతామణి కోదండచతుర్భుజము కోదండమండనము హరిహరచతురంగము రాజవిజయము వైశంపాయననీతిప్రకా

కంటెను వేయింతలు వికటభీషణవేషంబున బ్రజ్వలించుధనుర్వేదంబుగాని, దర్శనీయకైలాసోద్యానంబుల నేకాంతసుభగంబగు పార్వతీవిభుచే నవిచ్ఛిన్నానురాగభావబంధురంబుగ నుపదేశంబు నొందిన పార్వతీదేవికి సుకుమారకళయై, నందనవనసౌరభంబులకు సహచారంబుఁ గల్పించి దేవేంద్రుకొలువులోని మహాత్ములసయి ము సాలభంజికలవలె బొమ్మలెత్తి నిలుపంబడిన యూర్వశీప్రభృతులకు ముల్లోకంబుల విజయించి మెచ్చు మచ్చురుండునై, మురళీనాదమధురం బగుయమునాసైకతంబునఁ గృష్ణుని భువనమోహనరూపంబు దాల్చునట్లు చేసి మత్తమదనోన్మాదమదవిభ్రమంబుల శుకాదులనైన భ్రమింపఁజేయఁ బాడిన గోపికాజనంబునకు జీవనామృతంబును నైనగాంధర్వవేదముఁ గీడు రాఁగల దని యెవ్వరు తలంతురు? ఇట్టిగాంధర్వంబు నృత్తగీతవాద్యభేదంబుల మూఁడుతెఱంగుల భారతవారదాదిబహుప్రస్థానవిస్తీర్ణమై, సౌరాష్ట్ర మాళవ లాట కాశ్మీర కర్ణాటాంధ్ర మగధ వంగోత్కల ద్రవిడరాజులచేతను యుపలాలితంబై పరరాజధాటికి నిలువఁజాలక స్వస్వరూపవిశేషంబులం బాసి శాస్త్ర మొక్కపథమున, నభ్యాసము వేఱొక్కత్రోవను, ఉపదేశము మఱియొక్కమార్గమునను బోవుచుండఁ బవిత్ర మగుగంగాప్రవాహముంబోలెఁ ద్రిపథగాప్రభావంబై రామరావు నిష్పన్నపదవిం ద్రొక్కుచుఁ బాతాళమున నడుగంటుచున్నది. అహో భారతీదుర్విలాసము! యామళాష్టకతంత్రమున—

> గాంధర్వవేదః షట్త్రింశత్సహస్రగ్రంథసమ్మితః
> యత్ర సప్తస్వరోత్పత్తికథనం పరికీర్త్యతే
> వీణాతంత్రం కలాతంత్రం రాగతంత్ర మనుత్తమమ్
> మిశ్రతంత్రం తాళతంత్రం గీతికాతంత్రమేవ చ
> లాసికోల్లాసికాతంత్రం మేళతంత్రం మహత్తరమ్
> జాతిగ్రామలయస్థానం మార్గాంగప్రక్రియా క్రియా
> కాలజ్ఞానం వాద్యవల్లీ త్రిభిన్నాధ్యాయ ఏవ చ
> కురంగరతిసారంగ సింహలీలావిజృంభణం
> అంగహారప్రవిక్షేపాధ్యాయ స్సంతోషణక్రియా,
> ఏవమాదీని గాంధర్వవేదే సంతి సహస్రశః

అని 36000 శ్లోకపరిమితి గల యామళమాహేశ్వరసంహిత సూచింపఁబడెను (తంత్ర మనఁగా విద్య - షష్టితంత్ర మనఁగా నఱువది విషయములు విశదీకరింపఁబడిన సాంఖ్యశాస్త్రము.)

2. తంత్రము లని చెప్పఁబడినవానిలో శైవ, వైష్ణవ, పాశుపత, వైఖానస, శాక్తేయ, యామళాదితంత్రములు పెక్కులు గలవు. వానిలోఁ బరస్పరమతభేదములు గలవు. తంత్రములలో సకలవిద్యాప్రశంసలు వచ్చుచుండును. గాంధర్వము శైవశాక్తేయయామళతంత్రములలో సాధారణముగా వర్ణింపఁబడి నృత్తగీతవాద్యములలోఁ గొన్నిటికిఁ బ్రాముఖ్యము చూపఁబడెను. యామళతంత్రములు ముప్పదిరెండింటిలో—

> ఏకోనవింశం వీణాఖ్యతంత్రం లక్షప్రమాణకమ్
> నాదబ్రహ్మానందసిద్ధిర్యేన సిధ్యతి వై నృణామ్
> నిషాదాదిస్వరోత్పత్తి ర్గీతోత్పత్తేశ్చ లక్షణమ్
> రాగాణాం భేదకథనం రాగకాలానుకీర్తనమ్
> ధ్వనిప్రభేదకథనం మిశ్రామిశ్రవర్ణనమ్
> తాలశ్రుతిలయాదీనా ముద్భవశ్చోపవర్ణనమ్
> చతుర్విధానాం వీణానాం లక్షణం తంత్రి (?) లక్షణమ్
> కిన్నరస్వరమండలికానాం మేళలక్షణమ్ (కిన్నెర, స్వరమండలము లనునవి వీణలు)
> షడ్గీతాః ప్రకథనముత్పత్తిస్థానవర్ణనమ్
> ఏవమాదీని కీర్త్యంతే యస్మిన్ తంత్రే సహస్రశః

అని పందొమ్మిదవది యగు వీణాతంత్రము లక్షగ్రంథపరిమితమై సంగీతశాస్త్రము సంపూర్ణముగా విరచింపఁబడినగ్రంథమఁట. తొమ్మిదవది యగు కలాసారతంత్రమున రసభావనాట్యనాటకలక్షణ కామశాస్త్రాదివిషయములు గలవందురు. పదునెనిమిదవది కుండీశ్వరతంత్రము—

> అష్టాదశం లక్షమానం కుండీశ్వరమతాహ్వయమ్
> యత్రానేకవిధానాం తు విద్యానా ముపవర్ణనమ్
> నానానాటకవిద్యానా మలంకారానువర్ణనమ్
> సంగ్రామవిద్యా వేతాళవిద్యా లోకాద్భుతావహా
> మోదవిద్యా చ గాంధర్వవిద్యాశ్చర్యవిధాయినీ
> వీణావేణుమృదంగానాం తాళనర్తనయో రపి
> విద్యా సంగీతవిద్యా చ సర్వశ్రోతృమనోహరా
> చిత్రకర్మకరీ విద్యా చిత్రార్థస్య విధాయినీ
> చిత్రాభాషా శిక్షణికా విద్యాదృశ్యవిధాయినీ
> రసవాదకరీ విద్యా విద్యా ధాతుజయావహా
> పరకాయావేశకరీ సర్వాశ్చర్యవిధాయినీ
> నానావిధానాం గంధానా మాకర్షణవిధాయినీ
> జనయిత్రీ నరాంగేషు విద్యా సంమోహకారిణీ
> ఏవమాద్యా మహావిద్యాః కథ్యంతే యత్ర కోటిశః

అని యందు గాంధర్వచిత్రలేఖనమాయేంద్రజాలవిద్యలు గలవఁట.

3. ఇరువదెనిమిదవ త్రోతాళతంత్రమున

> "త్రోతాళనామకం తంత్రమష్టావింశం సలక్షకమ్
> యస్మిన్ భరతసర్వస్వం సాక్షాచ్ఛివముఖోద్గతమ్
> లక్షణం తాళభేదానాం సంగీతోన్మాదలక్షణమ్
> మార్గక్రియాంగజాతీనాం కలాగ్రహలయోద్భవః
> ధ్రువాదిసప్తతాళానాం తద్భేదానాం చ లక్షణమ్
> వైనాయకానాం మైశానాం వాగ్భవానాం చ లక్షణమ్
> అన్యేషాం తాళకోటీనాం దేశీయానాం చ లక్షణమ్
> చచ్చుత్పుటాదితాళానాం నిగాగమభువాం తథా
> విధా త్రిభిన్నతాలానాం యస్మిన్ తంత్రే ప్రకీర్త్యతే"

అని నాట్యశాస్త్రవిషయములు మాత్రమే లక్షగ్రంథమున వర్ణింపఁబడెనఁట. ఈతంత్రగ్రంథము లేవియును మనకు లభింపవయ్యె. అనుదినము చిత్రవిచిత్రములుగా నతిప్రాచీనగ్రంథములు లభించుచున్న

మన కివియెల్ల నబద్ధపంచాంగములోనివర్జ్యము లని తలంచుసాహసము జనింపఁజాలదు. శాక్తేయతంత్రములలో నుడ్డీశమహోదయ మను గ్రంథమున శివపూజాఘట్టమున వాద్యలక్షణము లానుషంగికముగా వర్ణింపఁబడియుండుట మనకు లభించుచున్నది. అందు

ప్రథమం తాళనిలయం ద్వితీయం ఝల్లరీ తథా
పంచమం భేరివిజ్ఞానం షష్ఠంతు అఖిలా తథా
సప్తమం తు హుడుక్కా చ తథాష్టమమిడక్కికా
నవమం డమరుకంచైవ దశమం మురజం తథా
ఏకాదశో౽ంగులిస్ఫోటో ద్వాదశం వీణికా తథా
ఆలాపని స్తథా వాద్యం త్రయోదశమతః పరమ్
చతుర్దశం చ సంప్రోక్తం క్షేమం రావణహస్తకమ్
పంచాదశక ముద్యంతం విద్యా ద్ఘోషవతీ తథా
షోడశం బ్రహ్మకంతాళ మేతైరధ్యాయషోడశైః
క్రమేణ వాద్యవిజ్ఞానం విస్తరేణ వదామి తే

అని పదునారువాద్యలక్షణములు పదునారధ్యాయముల నిచ్చట లభించుచున్నవి. అవి తంత్రిమూలమున వచ్చుచున్నవి. గ్రంథకర్త యొక్కొకటికి విస్తరముగా వర్కరణప్రయోగవిధుల నిచ్చియున్నాఁడు. జర్ఝరి వాలు తెగలుగా వర్ణించి—

ఇతి పరమవిధానం విసస్తృతం జర్ఝరీణాం
ప్రతి ఖలు వివిధానాం వాద్యభేదాన్ విశేష్య
నరకతనిలయే వా దేవగేహే మనుష్యే
సురమునిహితవాద్యం విశ్రుతం మంగలో౽యమ్

అని నారదమతానుసార మని ముగింపఁబడియె. ఇట్లే తంత్రములు లేకుండె నని చెప్పుట సాహసము.

గాంధర్వవిద్యలోఁ బ్రస్థానములు పెక్కులు గలవు.
"సదాశివస్య శివయో గౌర్యాయుతం వాసుకేః
వాగ్దేవ్యా అపి నారదస్య చముకేః కుంభోద్భవ వ్యాసయోః
శిష్యాణాం భరతస్య"

అనినందికేశ్వర ఉమామహేశ్వర వాసుకి సరస్వతీ నారదాగస్త్య వ్యాసమతములు గల వని శారదాతనయుఁడు పేర్కొనియె. ప్రస్థానభేదములుగా—నందికేశ్వర దుర్గా యాష్టిక దత్తిల నారద భరతమతము లౌను మనకుఁ గొంత తెలియుచున్నవి. నందికేశ్వరసంహిత 300 సంవత్సరములకుఁ బూర్వము తంజాపురీరఘునాథునివఱకు లభించియుండె. నేఁడు గానరాదు. దానిలోనిసార మగు "ఔమాపతము" భరతనారదాదిమతములకు విలక్షణముగా నున్నది. రఘునాథుఁడు సంగీతసుధలో—

"సమీక్ష్య నందీశ్వరసంహితాం తామాలోక్య శాస్త్రం భరతప్రణీతమ్
గ్రంథం బృహద్దేశ్యభిధం మతంగమునిప్రణీతం నిపుణం విలోక్య
విచార్య తాం యాష్టికసంహితాం చ జ్ఞాత్వాంజనానందనసంహితాం చ
ఉమాపతేరాధునికస్య తంత్రిమువీక్ష్య నందీశమతానుసారి
సంగీతసారం సమవేక్ష్య విద్యారణ్యాభిధశ్రీచరణప్రణీతమ్
నిశామ్య సంగీతకచంద్రికాఖ్యాం కృతిం చ భట్టాదిమమాధవస్య
శ్రీశార్ఙ్గదేవేన కృతాం చ సప్తాధ్యాయీం తథా లక్ష్యవిరోధి తేష్యమ్
(సప్తాధ్యాయీతి సంగీతరత్నాకరః)
ఏషాం స్ఫుటీకర్తుమిహ ప్రవృత్తా తా బ్రాహ్మణో కేశవకల్లినాథౌ
టీకాద్వయేనాపి కృతా న తాభ్యామబోధితాః స్పష్టపదార్థభేదాః"

అని నందికమతమున ఉమాపతి (1350 క్రీ. శ) రచిత మగు నౌమాపతము సంగ్రహరూప మని యేర్పడును. ఇది 40 అధ్యాయములలో నతిసంగ్రహితముగా లభించుచున్నది. శైవుధలోఁ బేర్కొన్న మతంగుఁడు బృహద్దేశి యను సాంస్కృతగ్రంథము రచించెను. దానిలో 6 పరిచ్ఛేదములుగా 1500 గ్రంథము గలభాగముమాత్రమే యనంతశయనమున లభించుచున్నది. అందు స్వరోత్పత్తిశ్రుతిభేదములనిర్ణయము మాత్రము కలదు. శిష్టభాగములభించు చేని లోకమునకుఁ జాల మేలగు. మతంగుఁడు ప్రాయశః భరతమతానుసారి. యాష్టికమతసారము 200 శ్లోకము లోఁ గానవచ్చుచున్నది. నారదమతమునకు నారదశిక్ష యను సామవేదశిక్ష గలదు. నారదసంహిత మాకు లభించినది కాదు. బృహన్నారదీయపురాణమునను నారదోపనిషత్తునను నారదమతసార మీయఁబడియె. సంగీతమకరందము నారదప్రోక్తముగా ముద్రింపఁబడినది. దానిని నారదమతసారముగా నెవ్వఁడో తన్నామమునఁనే రచించియుండును. ఏలయనఁగా గీతదోషములు వివరించుచు "మహామహేశ్వరేణోక్తః సదోషో గాయకాధమః" (IV పాదము-39 శ్లో.) అని మహామహేశ్వరాచార్యాభినవగుప్తుఁ (1000 క్రీ. శ) డగ్గ్రంథకర్త స్మరించుచున్నాఁడు. ఈగీతదోషములు చక్కఁగా వివరించినవారు భోజాభినవగుప్తులే యని శారదాతనయుఁడు—

ముదితం చ ద్రుతంచైవ దోషాః సప్తైవ గీతిజాః
ఏతద్వ్యక్తస్వరూపం భోజాద్యైః స్వప్రబంధేషు వర్ణితమ్
భట్టాభినవగుప్తాద్యైరేతత్ప్రదర్శితమ్
మయాపి శారదీయాఖ్యే ప్రబంధే సుష్ఠు దర్శితమ్

అని చెప్పెను. నారదశిక్షకు నాచార్యశుభంకరుఁడు సుందరమైనవ్యాఖ్య రచించె. ఈరెండును దన్మతమును జక్కఁగా నెఱుఁగుటకు మనకు లభించుచున్నవి. రాగసాగర మనుపేర దత్తిలనారదసంవాదరూపముగా నొకగ్రంథము కలదు. అది సుమారు 800 సంవత్సరముల నాఁటి దనియుఁ దన్మతముల వ్యక్తీకరింప నుపార్థ్యము చాల దనియు మాయభిప్రాయము.

సంగీతరత్నాకరకారుఁడు భరతమతమును సాధారణముగా నవలంబించినను దుర్గాదత్తిలమతములును గొంత గ్రహించె. గీతవిభాగమున
"శుద్ధా చ భిన్నా చ తథైవ గౌడీ సా వేసరా స్తత్ర తథైవ చతుర్థీ
సాధారణీ పంచమికా తు గీతి ర్దుర్గామతే వైంతి పంచధోక్తా
ఆశ్రిత్య దుర్గామతమేవ సమ్యక్తాః శార్ఙ్గదేవేన తు పంచధోక్తాః
తిస్రస్తు తా యాష్టికసంమతాః స్యుః భాషైక శార్దూలమతే తు గీతిః"

కదా చిన్మండలీభూతా యుక్తిభిర్బహుభంగిభిః
శివోత్సవేషు కర్తవ్యం నృత్తమేతచ్ఛివప్రియమ్
కరతాళయుతోపేతైర్వాద్యైర్వర్యక్రమస్థితైః సహ
పాదైర్లలితలాస్యాంగైశ్చారీభిర్గతిభిస్తథా
గీతాభినయనోపేతైర్ద్విపదైశ్ఛందసంజ్ఞకైః
చిందునృత్తమితి ప్రోక్తమిదం ద్రవిడవల్లభైః" అన్నట్లు శైలూషకులైన
(?)ము చెవరకుండ వాడును శేడును బొడ్యకనాటక మగు పయణి
మలమీఁదఁ గుమారస్వామియెదుట పాడిపాడి భక్తజనులకు శివ
సాయుజ్యము ముహూర్తమాత్రమేని యీఁజాలినయీనృత్తవిశేషమును"
కల్యాణకటకే పూర్వం భూతిపూర్వపుటోత్సవే
సోమేశః కౌతుకీం కాంచిద్భిల్లీవేషముపేయుషీమ్
నృత్యంతీమథ గాయంతీం స్వయం ప్రేక్ష్య మనోహరమ్
స్త్రీతో నిర్మితవాంశ్చిత్రం గొండలీవిధముద్భుతమ్
తతో భిల్లీ మహాశాస్త్రే గొండలీత్యభిధీయతే"

అనునట్లు చాళుక్యసోమేశ్వరుఁడు (1129 క్రీ. శ) కల్పించె
నన్న గొండ్లీ (కుండలీభేదము) నృత్తమును మొదలుగా నవాంతరభేదములం
నంది పరిగ్రహించి వెలయించెనని యూహింపఁదగియున్నది. ఆంధ్ర
రాజులసభలలో నీనవీనప్రస్థానమే యెక్కువ యాదరింపఁబడియె
ననుటకుఁ దత్పారిభాషికపదములు నాఁడుకభాషలో నోట మెదగుచుం
డుటయే సాక్ష్యము. ఎట్లనఁగా—
పిశాచవానరాదీనాం వేషచేష్టానుకారకమ్
వికృతైరాననోష్ఠాక్షికుక్షివాక్చరణాదిభిః
విలాళం వికృతం నృత్తం హాస్యకృత్ప్రకటం విదుః
కైశ్చిద్వాంగడమిత్యుక్తం హాసకానాం ప్రసిద్ధితః"
అని వికృతచేష్టా సూచక మగు శబ్దమును పాటపాట, కోలాటము (వీర
రసవ్యంజకము), గొండ్లీ, చిందులు మొదలగుపదములు కావ్యములలో
సాధారణము లయ్యె.
"సర్వంసహా కాంత పేరణము సూపు"
"ఉజ్జ్వలతలాఁగెడుపదయాస్త గిరులచే నాకాశలక్ష్మి కోలాటమాడె'
"కమలసంభవుఁడు పెక్కణ మొనర్ప," అని సోముఁడును
"ఏకసక్తముగ నాడు నేదైననొకమాట పాడు సోయ్యనపాట పాటపాట"
"ఊలుమదప్పళ్ళకును ఓళ్లఁదొరులప్రోఁక" (జక్కనీలతుకము),
"గొండ్లి యాడించుచున్నారు గొరిగపడుచు"
"మత్తల్లిమహానృత్యముల్" అని శ్రీనాథుఁడును మొదలుగా పెల్లరు
గ్రహించిరి.

ఇట్లు గీతనృత్తతాళముల మాటను నవనవోన్మేష ప్రతిభావిలా
సమునకు భారతీయ మందక పోవుటచే విచిత్రతాళపరంపరలును మాఁ
టిసమ్మేళనమునఁ బ్రబంధవిశేషములును లెక్కలేక జన్మించినవి.
కావున భారతీయము కేవలము జ్ఞానాభివృద్ధికే కాని ప్రథమశిక్షకుప
యోగింపదని తోఁచుచున్నది. అభినవగుప్తవ్యాఖ్యతో రసభావాధ్యాయ
వివరణము మహాప్రౌఢమై విద్వదాదరణీయమై యున్నది. కానినే
యాలంకారికులెల్ల సాధారణముగాఁ గొని తమతమబుద్ధికైవచిత్రిని బ్రక
టించిరి. భారతీయావ్యాకరణసరస్వనండి తీసినపిల్లకాలువల నింపుకొ పరిగ
ణింతము.

గీతస్కంధమున నాగార్జునని గ్రంథభాగము ప్రాచీనమైనది
(క్రీ. శ. 100) లభించుచున్నది. క్రీ. 1000 కిఁ దరువాతి గ్రంథములలో
నభినవగుప్తునిభారతవ్యాఖ్య నిరుపమానమై యతిప్రౌఢమై బహుప్రస్థాన
పరీక్షకంబై యున్నది. అతనినాట్యలోచనము లభించినది కాదు. త్రిలో
చనునినాట్యలోచనభాగము దొరకినది. పార్థవిజయ మను సద్భుతనాట
కము రచించినత్రిలోచనుఁడే దీని రచియించియుండిన నిది రాజశేఖ
రునకుఁ (900 క్రీ. శ.) బూర్వగ్రంథ మగును. ఇది నృత్తమునే ప్రతి
పాదించుచున్నది. క్రీ. శ. 1120 లో చాళుక్యసోమేశుఁ డభిల
షితార్థచింతామణిలో నృత్తవాద్యప్రబంధలక్షణముల విస్తరించి సుస్థి
ఫుగా విరచించె. 1210 ప్రాంతములఁ ద్రివిధగాంధర్వముఁ బ్రతిపా
దింపఁ గలసంగీతరత్నాకరమును శార్ఙ్గదేవుఁడు రచియించె. ఇతఁడు
కర్ణాటరాజగు సింగణునిసభలో గాయకరత్నము. దీనిపై సంగీత
కౌస్తుభ మను సల్పవ్యాఖ్యయుఁ, గల్లినాథుని ప్రౌఢవ్యాఖ్యయుఁ గలవు.
1160 ప్రాంతములఁ గాకతీయరుద్రదేవునిసభాలంకార మగువీరభల్లట
దేశికుఁడు నాట్యశేఖరము రచించెనఁట. అది యిప్పుడు గానరాదు.
నాట్యసంగీతగ్రంథకారులలోఁ బెక్కండ్రు సన్న్యాసులు శైవా
చార్యులు అస్ఖలితబ్రహ్మచారులు కాక్తేయులు నగుట విచిత్రముగా
నున్నది. క్రీ. శ. 1236 ఆనందవర్షమునం గాకతీయగణపతిదేవుని గజ
సైన్యాధిపతియు బావమఱఁదియు నగు జాయసేనాపతి నృత్తరత్నావళి
యని యెనిమిదిపరిచ్ఛేదముల మార్గదేశీరీతులరెంటను నృత్తలక్షణము
పూర్ణముగా రచించె. ఇది లభించుచున్నది. 1300 కాలమునఁ బార్శ్వ
దేవుఁడు జైనకర్ణాటకవి సంగీతసమయసారమున గీతస్కంధమునే మార్గ
దేశీరీతుల విరచించెను. ఇతఁడు భోజసోమేశ్వరాదులఁ బాల ననుసరించె.
1280 కాలమున భల్లాకరాజగు ప్రతాపచక్రవర్తిజగదేకమల్లునిచే
సంగీతచూడామణి నృత్తగీతాధ్యాయములు ప్రముఖములుగా వాద్య
లక్షణము న్యూనముగాను రచింపఁబడియె. 1200 (?) కాలమున మగ
ధేశుఁ డగుకుంభకర్ణనరేంద్రుఁ డద్భుతముగా సంగీతరాజ మను పేరఁ
ద్రివిధగాంధర్వమున, సన్నివతములఁ గ్రోడీకరించి 17000 గ్రంథ
ముగాఁ గూర్చెను. అందు 12000 మాత్రమె లభించును. కాని నృత్తా
ధ్యాయము గానరాదు. 1220 (?) కాలమునఁ జాళుక్యహరిభూపా
లుఁడు సంగీతసుధాకరమును శ్రీరంగమున నాదువేశ్యలకొఱకు రచి
యించినగీతనృత్తాత్మకలఘుగ్రంథము దొరకును. 1340 (?) కాలమున
నష్టావధానవిఖ్యాతుఁ డగుసోమనార్యుఁ డను నాంధ్రుఁడు నాట్య
చూడామణియను పేర గీతనృత్తముల నవీనప్రస్థానకముగా విరచించె.
ఇతఁడె నాదనసోముఁడా యని సందియము కలుగుచున్నది. 1360
ప్రాంతమున విద్యారణ్యులు సంగీతసారము రచించిరి. అది ప్రాచీన
గ్రంథములలోని దోషములను విరోధములను బరిహరించి విలక్షణముగా
రచియింపఁబడియుండు నని తెలియుచున్నది.

"నిరూపితా లక్షణతో వివిచ్య రాగాశ్చతుః పఞ్చాధికం శతే ద్వే
కర్ణాటసింహాసనభాగ్యవిద్యారణ్యాభిధశ్రీచరణాగ్రణీభ్యః"

సంగీతసుధ.

మాకు లభించినసంగీతసారము లఘువిషయకమై లక్షణమందుఁ గానరాకున్నందున విద్యారణ్యులనిబంధ మింకను వెదకవలసియే యున్నది. 1420 కాలమున దేవణభట్టను విద్యానగరాస్థానపండితుఁడు సంగీతముక్తావళి యని నృత్తగీతలక్షణముల సామాన్యరూపముగా రచించె. ఆకాలముననే శ్రీనాథవామనభట్టాదులకుఁ జేయూఁతయై రసికసార్వభౌముఁ డగుపెద్దకోమటివేమన సంగీతచింతామణి యను నృత్తగీతలక్షణగ్రంథము రచించె. అది యిప్పుడు నసంకీర్ణముగ లభించుచున్నది. ఈకాలముననే రేచెర్లవంశమణి యగుసింగయ్యమాధవేంద్రుని సభాలంకార మగునాంధ్రకవి గౌరన లక్షణదీపిక యనుపేర సంగీతభాగమును జిత్రవిషయకముగాఁ గూర్చినది కలదు. 1350 (?) కాలమున దామెరాజుసోమన భారతీయమంతయుఁ దెనిగించినట్లు కానవచ్చుఁ గాని యది సంపూర్ణముగా లభింపదయ్యె. 1500 (?) ప్రాంతమునఁ గర్ణాటసంగీతమునకు భిన్నప్రస్థానముగా నాసికప్రాంతవాసి యగుపుండరీకవిఠ్ఠలుఁడు నర్తననిర్ణయ మని నృత్తగీతాధ్యాయముల రమణీయముగాఁ గూర్చె నాతనిరీతులు దానిఁ జేయూఁతగాఁ గొనిరి. వీణావాదనమున నుపకారిగాఁ గర్ణాటరాయ గాయలయాస్థానభూషణ మగు రామామాత్యుఁడు స్వరమేళకళానిధి యని సంగీతలక్షణమె చక్కఁగా వివరించె. మేళవిషయమున దోషపరిపూరిత మని గ్రహించి దీనిని తంజాపురిరఘునాథునిశిష్యుఁ డగువేంకటమఖి యను మీమాంసకుఁడు తనచతుర్దండిప్రకాశికలోఁ గఠోరముగాఁ దిట్టినను రామామాత్యునిమేళలక్షణమే నిర్దుష్ట మని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. 1600 కాలమున నహోబలుఁడు సంగీతపారిజాత మనుపేర నిర్దుష్టముగ గీతభాగమును లఘురూపమున వివరించె. ఇతఁడు రామామాత్యుని మేళలక్షణముల సమర్థించుచుండును.

1620 ప్రాంతమున "సుజ్ఞానజనకుం" డనుబిరుదము వహించిన తంజాపురీరఘునాథరాజు సాక్రయించి తత్సభలో సంగీతసాహిత్యముల సామరస్యముఁ జూపి యచ్చరలకేవలగాంధర్వకౌశలముఁ బరిహాసింపఁజాలుమధురవాణి, రామభద్రాంబ, రంగాజ మొదలగుభోగినీజనుల పుట్టుమైలను గడిగివైచి వారికిఁ గీర్తిసౌరభముఁ దేఁజాలినగాంధర్వవిద్యాధిదేవత చోళదేశమును నిజపీఠముగాఁ జేసికొని త్యాగరాజాదుల యపూర్వగీతగమకములకు సమవాదినీయంత్రములైనను స్ఫురితకంపితములఁ దెలుపఁజాలె ననుట యచ్చెరువు కాదు. అట్టిరఘునాథుఁడు రచించినసంగీతసుధ యనునిరుపమానగ్రంథములో నాల్గధ్యాయములు మాత్రమే స్వరశ్రుతిరాగప్రబంధలక్షణములు గలవి లభించుచున్నవి. నృత్తతాళాధ్యాయములు లభింపవయ్యె. శాస్త్రలక్షణరహస్యములు తెలియఁగోరువారు దీనిం జదువక మానరు. ఇందు భిన్నప్రస్థానముల మతవిశేషములును వివరింపఁబడియె. లక్ష్య లక్షణవిరోధములఁ దీర్చి శ్రుతిరాగస్వరూపము నొక్కమారు వినినంత మనసులో నాటుకొనునట్లు రాజకవి యతిస్పష్టముగా విషయవిమర్శము చేయుచుండును. 1640 లో నితని శిష్యులలో నొక్కఁ డగు మహామీమాంసకుఁ డని కీర్తి గన్న వేంకటమఖి తన చతుర్దండిప్రకాశికలో వీణాలక్షణమును శ్రుతిస్వరూపరాగస్వరమేళనము నాతని భక్తిగా విశదీకరించె. రఘునాథవేంకటమఖు లిరువురు క్రొత్తవీణల సృష్టించి వాడుకలోకిఁ దెచ్చిరి.

ఓఢ్రదేశపురాజులు శాస్త్రసాహిత్యములందే కాక సంగీతమునను గ్రంథరచన పోషించిరి. భట్టుశుభంకరుని నారదశిక్షావ్యాఖ్యయు, నతని సంగీతదామోదరమును, (పర్లాకిమిడి) గజపతినారాయణదేవుని సంగీతనారాయణమును, కలాంకురనిబంధమును, సంగీతసరణియు మొదలగునవి [illegible]లభారతీసేవను ప్రకటించుచున్నవి. ఇవియన్నియు నేకప్రస్థానగాములై చాలలోఁతునకు దిగక సామాన్యముగా గాంధర్వప్రక్రియనె తెలిచెప్పఁజాలు.

ఈశాస్త్రావతారక్రమము నించుక యవధరించి చూచిన మొదట సౌరాష్ట్రమున జనించి కర్ణాటచాళుక్యరాజుల చల్లఁజూపులఁ బెరిగి యాంధ్రరాజు లగుకాకతీయరెడ్డివిద్యానగరతంజాపురీరాజుల రావలంబమున సౌభాగ్యము వహించి భావరసగర్భితము లగుక్షేత్రయపదాదులకు విచిత్రవైఖరిం గూర్చునంత్రభావతోడనె యేకసభోద్యము గన్న గాంధర్వవిద్య యాంధ్రులగర్వాభిమానములఁ బురికొల్పుననుట యేమి యనుచితము! ఇట్టిదివ్యవిద్యనుగూర్చి యాకాశవిమానగామి భూమండలము మీఁదిమైనుమపుఁ జూపించినట్లు శాస్త్రగహనంబుఁ జొరక వాదజ్వరము సోఁకేనేని ముకుటభంగ మగునేమో యని వెఱచుచుఁ బత్రికలో స్థలము సంకోచ మయ్యె నని మిష చూపి మా యజ్ఞానమును గప్పిపుచ్చుకొనుటకు మమ్ము విజ్ఞులు క్షమింతురు గాక.

ఈయుపవేదముల నాలుగింటికి నాలుగవేదములు పిల్లలు గలవు.

"ఆయుః శిల్పం జ్యోతిషశ్చ ధాతుర్వేదస్తు వై క్రమాత్."

ఆ యీ శిల్పధాతువేదములగురించి మతభేదములను గ్రంథనామములను స్థలాంతరమున వివరించెదము.

# శ్రీ నగరాజకుమారికా పరిణయము*

## బ్రహ్మశ్రీ పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులవారు

### ౧. ఓం శ్రీమాతా.

క. శ్రీమాత! మణిద్వీప, స్వామిని! కామేశ్వరమ్మ! • చయ్యన నన్నున్
జామాతగఁ జేయుము గిరి, భూమీశున కీవివాహ • పుణ్యదినములలోన్.

### ౪. ఓం చిదగ్నికుండసంభూతా.

ఉ. జీతము బత్తెముం గొనక • చెప్పినచొప్పున వెట్టి చేయుచుం
జే లిననర్మ మంచు విధి • యించితి మాత! చిదగ్ని కుండసం
భూతవు జేసి యాపలుకు • పూర్తిగఁ జూపితి చూచుచుంటె నా
చేతములోన నెప్డును వ • సించుచు నాపొనరించు చుండుబల్
చేత లొకప్పుడైన "ఇది • చేసితి నియ్యది యు" ట్లంటుచు నిన్
గాతరతానిదానముగఁ • గంపము నొందుచు వేఁడికొంటనై
చేతులు దోయిలింపమిని • చెప్పుట యెందుల కన్ని యైనత
ర్వాతను వేఁడుచుంటి నల • పర్వతరాజమ్మాదగ్ని కుండసం
భూత విశుద్ధిసీత నమఁ • బూర్తిగ నమ్మినయమ్మలాఁడి నా
కై తనచిత్తమున్ దనువు • కాన్కఁగఁ బట్టినదిట్టురాలు నా
చేతములోన నుండెడి • విశేషము లన్నియుఁ జూచుకొన్న ద
ట్టో! తనకంటెదంటు యగు • బోటి లభించునె పున్నె మంచు నా
చేతము నమ్మనట్టులఁగఁ • జేసిన భాసురగాత్రి నైజమా
చేతమురీతి యందలివి • శేషములన్ సరిపార కాక త
న్మాత్రసమేతమున్ నిరస • మానము గాఁగ నెఱుంగునట్లు ప్ర
ఖ్యాతము చేసినట్టి "దహా • హా! ఇటువంటికృతార్థ యుండు నే
యూతలిరాపుఁబోసిన్యాద • యుశ్వరుఁ డీశ్వరుఁ డంట! ఈవిధిన్
మాతయుఁ దాతయుం గలిసి • మంచిదె యందురుగాక వెంటనే
యూతరుణిం దదీశ్వరున • కీతరుణమ్మున నిచ్చి పెండ్లి చే
చేతురుగాక" అంచుఁ దన • చెల్లెలిపిండును చెల్మికత్తెలున్
"నాతొలిపట్టె కిట్టెలల • నామణి కట్టినగండు గల్గ నా
ధాత లిఖించునే? యిది య • థార్థము స్వప్నము? నిక్కమైనచో
నాతొలుఁ బాములందలి య • నంతతపమ్ము ఫలించినట్టుగాఁ
జేతములోన నెంచుదున • శ్రీహరి కూఁతురు మనోరథమ్ముఁ ద
త్తాతమునమ్మనన్ నిలిచి • తప్పక తీర్చును గాత" మంచుఁ ద
న్మాతయు నంతరంగముల • మాటికి నెంచఁగఁ జేయుచున్న దా
ఖీష్టకరంగనేత్ర నికఁ • బెండిలి కూఁతురుఁగఁ జేసిపెట్టు విం
తే తలితల్లి! నిన్నడుగ • నెంచిన దీ వొసరింపఁ దగ్గదిన్.

### ౭. ఓం చతుర్బాహుసమన్వితా.

ఉ. బాహువు లెందు గల్గియు నెఱుం బా సన నిచ్చెద నెల్లరున్ జతు
ర్బాహులు గల్గి వెల్గు నినుఁ • బ్రాంజలినై యిటు వేఁడుచున్న నా
దాహము నెట్లు తీర్చెదవో? • తల్లిరో! మెల్లఁగ దానితండ్రి దు
ర్మోహముఁ బాపి నాహృదయ • మోహిని గేహిని నెట్లు దెచ్చెదో?

### ౯. ఓం క్రోధాకారాంకుశోజ్జ్వలా.

ఉ. క్రోధము పేరియంకుశముఁ • గొండొక చేత ధరించునంబ! ఆ
భూధరరాజకన్యకత • పోవిధినైనను బాలిఁ బాల్చి నీ
క్రోధమిపాంకుశమ్మునను • కుంజరతుల్యుఁడు దానితండ్రికిన్
బోధముఁ బుట్టఁజేసి తన • పుత్రిని దెచ్చి యొసంగఁ జేయుమా!

### ౧౩. నిజారుణప్రభాపూరమజ్జద్బ్రహ్మాండమండలా.

ఉ. ఖండితఖండ! నిన్నరుణ • కాంతిమహాపరివాహమందు బ్ర
హ్మాండము లన్నియున్ మునుఁగు • నట్టు లొనర్చి తనర్చునంబ! ఆ
కొండలరాజుగారి పెద • కూఁతురు మాఁదవకన్నతోడిబల్
పండితురాలు "నన్నుఁ దమ • భార్యఁగ ధుర్యఁగ నార్యపుత్త్ర! నై
కొందురు నంత యేల? తమ • కోసము దాఁచినయట్టి నామదిన్
గుండయుఁ బిండిగాఁ జితుకఁ • గొట్టుచు నట్టడి చేయుచున్న వా
రండి! దయామయా! 'అబల' • అంచుయునన్ కనికార ముంచి నే
లొంకుబిడాయమున్ విడిచి • యొప్పఁగ ధైర్యము సాహసమ్ముఁ గై
కొం డిఁక దేవి మీకు న • నాలయె కావున నెట్టులేని మీ,
ఖండనపాండితిం దెలిపి • ఖండపురాతనుఁ డాదిరైనయా
దుండగులన్ ప్రియా! మనకు • ద్రోహముచేయుచునుండుగండలన్
గం డడఁగించి పట్టుమను • కట్టుకొనం డిటు చిత్తగింపుఁ డీ
యుండెడి యొసంగుదాన నిది • యొక్కఁడె నేయదె పెక్కుకోటు లె
న్నండు తమర్ కృతీయునయ • నమ్మును నాకు నొసంగి లోన "శ్రీ
మండలిలోన సర్వగుణ • మాన్యవు క" న్నని యాశమెమ్మె కా
కుండినచో—ఆమోఘవర • మో దయచేసితిరో వినుండి య
న్నండెదుండీ నిజమ్ముగ మ • నమ్మును మీకు నొసంగికొంటి "నె
న్నండును తీసికో" నని మ • నమ్మున నమ్ముఁడు మీరె చిత్తమున్
పండువుగాఁగ నిచ్చుకొని • బాపురె! మాజనకుండు మూర్ఖుఁడై
యుండెలుగాఁగ నోసి వధి • యింపఁదలంచిన—అట్లె చేసికో
నిండు శరీర మింకొకని • కిచ్చెద నే? అది వట్టిమాట; కా

---

* (బ్రహ్మశ్రీ పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారిచే రచింపఁబడిన మైప్రబంధములోని రెండవభాగమగు "ఈశ్వరాక్రందనము—శోక—ఫాలనేత్రాధ్యాయము" లోని కొన్ని పద్యములు ఇందు ప్రకటింపబడినవి. ఈ యాశ్వాసము శ్రీలలితాసహస్రనామములతో సంపుటితము.

# ఆయుర్వేదము

కందుకూరి వేంకటసుబ్బరావు గారు

ప్రాక్తీర్థఁ బోరలుప • పచ్చడె బూచియున్నఁదో, మన్నజంకని హృద • యంబుఁగలిగి
చినినాఁడె పసిబాలు • రను జేర్చి శల్యాల, బొమ్మరింట్ల శకుపో • యుము వెలార్చి
జననాదిమంది జీ • ర్ణానఁ జీరి రొమ్ముఁగక, బుద్ధిచే రసపాక • ముల సెటింగి
తనుశల్యాకలు వాడఁ • దరితీరిటము దాల్చి, సంతోషమున వారి • సంగ్రహించి
గీ. తార యను బ్రహ్మ రొమిమిది • చేతులెత్తి, యలరి వేదోక్తి నాశిస్సు • లందఁజేయు
నవతరించెను మనపుణ్య • మా యనంగ, క్షితిని వైదిక వైద్యలక్ష్మి • లలామ.
సీ. వేదవిద్యాగంధ • విపుల సువాసిత, గృహరాజములు పుట్టి • నిండ్లు గాఁగ
శిల్పగాన ధనుర్వి • శేష సరస్వతీ, త్రయి మెప్పుఁ జెల్మిచే • డియలు గాఁగ
సకలదిగ్దేశ రా • జస్థానమందిరా, వరణమ్ము లవి యాట • పట్లు గాఁగ
సర్వచరాచర • సంరక్షణ ప్రథా, ప్రవృత్తి జన్మ సా • ర్థకము గాఁగ.
గీ. వర్తన మొనర్చి యమ్లాన • కీర్తి పువ్వు, మాలికలు భారతాంబకుఁ • గీలుకొల్పఁ
గలిగిన దినమ్ము లోకవాఁడు • తెలిసియుండె, నతులగతి నార్య వైద్య • విద్యావతికిని.
గీ. వనవిహార మొనర్చు నా • భారతికిని, స్వర్ణపాత్రమ రసవిశే • షముల నింపి
యాదిథాతిథ్యమొసఁగ నా • గార్జునుండు; నాఁడె మెండలు స్వదేశంబు • మీదుటకును.
గీ. తిరిగెను నరేబియా యెల్లఁ • దిరిగెనంత, సెసఁగు నీజిప్తు గ్రీకును, • నిటలియును, నయి
రోపయును స్వేచ్ఛను ప్రపంచ • మొపిసంత; తిరుగదే! కాలచక్రంబె • తిరుగుచుండ.
సీ. ద్రవిడదేశము మాటఁ • దలఁప నగస్త్యవై, ద్యమువిప్పు జేయుమా • ర్గమును గనదు
కేరళంబున్న నీ • తేషమ్ముగా వాగ్భ, టుము నిల్పి మొట్టఁకా • లమునఁగడుపు
ఓఢ్రదేశము వలు • కొక్కోకే కలదు లం, ఖనమొక్కఁడేగతి • గాఁగనుండు,
పశ్చిమదేశభా • వమ్ము గాంచిన మాకు, శవపరీక్షిత్వమే • చాలునమను,
గీ. ఆంధ్రదేశముమాట వే • ఱుదగనేల? బసవరాజీయ మొక్కఁడె దై • వంబు గాఁగ
నాఁగులాడుచునుండెన • యొయ్యో! తలంపఁ, బరిటేలోఁ దల్లిగతియుంచు • బుడుతలగతి,
చ. అనుపమచాకచక్యమున • యంత్రసుశస్త్రశలాకలన్ వినా
తనఘనకర్మలం జరిపి • ధారుణికంతకుఁ గ్రొత్తదారిఁ జూ
పిన వరభారతీయులను • బిడ్డలమై, ముల్లుగ్రుచ్చుకొన్నఁ దీ
యును గరణమ్ము కండయిన • నారయ నేరనివారమైతిమే?
సీ. కాసారమున నోవ • ధీసారమును రువ్వి, నీరునింకింపఁగా • నేర్చువారు
మణికట్టుపట్టు దార • ముముగట్టి నాడీ వి, శేషప్రచారంబుఁ • జెప్పువారు
కడవరంధ్రమునుండి • కొనలువారి స్రవా, హమ్మును నొకమాత్ర • నాపువారు
కనికరోగికిఁ దగ్గ • ఘనమూలికాబంధ, మల్లాడునట్లుగా • నరయువారు
గీ. అంత్యదశలోన గుడగుడ • లాడువాని, నైన నోరారఁ బల్కించి • యలరువారఁ
బూర్వ మొండిరి యీభార • తోర్వినని ధి, వక్రవిశంస విన్న మనః ప్ర • శాంతి యవదు.
సీ. ఇది చరకాచార్యుఁ • డుదయించి వెలసిన, పంజాబుదేశమా? • బాగుబాగు!
ఇది దివోదాసున • రేంద్ర ధన్వంతరి, వారణాసీపురంబా? వె • బాగు!
ఇది వాగ్భటాచార్యుఁ • డుదయించి ప్రబలిన, సింధుప్రదేశమా? • చెప్పసిగ్గు!
ఇదివల్లభాచార్యపదధూళి • రాలిన, యాంధ్రప్రదేశమా? • యనఁగ రాదు!
గీ. ఇదె భరతఖండమందు • వచించునెడల, బధిర పంగ్వంధ కుష్ఠరో • గమ్ము లేల?
ఘోరతరమృత్యుదేవివి • హార మేల? సత్త్వజాతీయ భావంబు • చావనేల?
గీ. కడచినది యొద్దిదైనా చాల • గడచిపోయెఁ, దిరిగి తొల్లింటి యాయుర్వి • ర్ధిరము దివుగ
కాలచక్రమ్మునందునఁ • గాంచ వగును, బెదఁగుకొమ్మన్న చేసన్నఁ • జెడెడిదేమి?

సీ. మెస్మరీజము లేదు • లేము కన్పెట్టితి, పంచమపల్కుఁ దలఁ బంకించి యించి
అదిరిచే వైద్య • మారసెఁ గాని రో, హా! యన్న చెప్ప • నిట్టూర్పుడించి
ప్రతిపదార్థమును ద్రావకము దీరదుట లేదు, పాడమెగా యన్నఁ • దుష్ప్రవను నమిసి
సర్గి గని పెట్టఁ • జాలివారము ప్రజ్ఞ, తెలిపినే యన్నఁ గ • త్తి జలిపించి.

గీ. యణుకమన్నది యెయ్యెడ • కణుకఁగలరు? చాలు నింక, పాయుర్వేద • శక్తి సెంచి
తన్మహారాధనోద్యుక్త • తన్మయులయి, మాతను భజింపుఁడు! • పరాభిమానులార!

గీ. అదిమానిసుభాషిత • మరసిరేని, యాధునిక మహాత్మసుబోధ • మరసిరేని
విమలదేశీయవైద్యముం • ప్రీతిఁ గొనుఁడు, మానధనులార! భారత • మానులార!

సీ. కల్గుఁగాక! స్వదేశ • కాసారమున వైద్య, శాస్త్రాబ్జము • లభంగ్ జనులు గాఁగ
నాట్యమాడును గాక! • నయుభివర్గం సరు, వుల్కలును కోగులఁబరోం • బులును గాఁగ
వర్తింనుఁగాక! సంపదోత్సవదీపాయు, వురుభిలప్రకృతికంధరము గాఁగ
అలరుండును గాక! • నైకమత్యప్రవీ, పంబవజ్ర తిమిరంబు గాఁగ

గీ. వేగ లగియించు గాక! సంవీనభాగ్య, భోగ్యరాజ్యాంగ లక్ష్మివిభుత్వసత్వ
సర్వరస్వరాజ్య ప్రమోదర్వపాల్వ, కర్వ మా పరబ్రహ్మ ముఖ్యమ్ము • గాఁగ.

# అభిసారిక

ఎ. వి. నరసింహము పంతులు గారు

గగనభాగంబెల్ల • భువనంబు క్రమ్మ
నెగడుచుఁ జీకువాల్ • నీలిమల్ గ్రక్కఁ
గొనకొని విహగముల్ • గూండ్లను జేరి
మెదవని సెక్కెలలోన • ముక్కులఁ జొన్పి
పంజాళాలాపముల్ • మఱచి కూర్కఁగఁ
గుంజరవిశ్రాంతి • కుంజముల్ గూర్ప
నెరయఁ బ్రాకెడి సరీసృపముల తతులు
సరసర మనిరొండి • సవ్వడుల్ నింప
ఘూకాళి యులివుల • గుండియల్ వ్రీల్ప
సోఁకుమూఁకలఘాతి • ఘ్రాణముల్ దోప
ఝిల్లిఝిల్లన గాలి • యీట్లు వీవంగ
ఝిల్లిపల్లంబులఁ • పేరలు సెడఁగ
వ్రేళ్ళ మెట్టెలనంత • వేళంబ యూడ్చి
కాళ్లయందెలఁ దీసి • కటియుముల్ విడ్చి
చెచ్చెరఁ గుచ్చెలల్ • జీరాడనీక
కచ్చియ బిగియించి • కదలకయుండ
పటిలంబుగాఁ జెక్కు • పయ్యెద గొంగు
సెదలోన భావజు • నెలమితో నమ్మి
లలిఁ దపసాదపల్లవముల నేల
మెలఁపుమై నిమచు సంస్మేరానవాబ్జ
గాఢాంధకారమై • క్రాలెడి రేయి
గాఢానురాగసంగతి నీయుహామ్మ
నాకమ్ముగా మార్చ • నాయకుఁ జేరి
మేకొని మెలపులలో • మెలపుచందమునఁ

దమి కాఁగలేక చిత్తము దత్తరిల్ల
గమనమాంద్యముఁ గూర్చి • కడు తల్లడిల్లి
తనవారి కనుఁబ్రామి • తలఁ కెడ మాని
వనవాటి కలఁగూర్చి • పల్లభుఁ దలఁచి
క్రమ్మిన మోహాంధకారంబుకంటెఁ
జిమ్మచీఁకట్లవి • చెట్టులేయంచు
భువవేణి పికవాణి • కంతునిరాణి
కనరైనమృగ్రోణి • యిసురాకుఁ బోణి
యభిరామగతులతో • నందందుఁ బొంచి
యభిసరించెడి నొక్క • యతివ రాగమున
ఝిల్లీనినాదముల్ • చెవుల నగల్ప
ఝల్లీచయంబులు • పాదముల్ చెవఁగ
తేమానిసన్నల • లేఁత పంజరులు
భామ చెక్కిలి సోఁకి • భావముల్ రేపఁ
కుంజపుంజమ్ములు • గోకను లాగి
కుంజర గామిని • కోర్కెలు పెంచ
భ్రాంతమౌమదిలాగఁ • బలుపలంకులకుఁ
గాంతుని దెసగూర్చి • కాళ్లవిలాగ
చెక్కు చూపులఁజాచి • చెంగటి దా నిలిచి
పులుకు పులుకనఁ జూచి • పోవ నుంకించు
నిట్టూర్పులందలి • నెగడు వేఁడిమికి
బిట్టుగాఁ గెమ్మోవి • పీటలు వాఱ
సవరణసంకేత • స్థలమును గూర్చి
చివచివ నేగెడి • జిగురాకుఁబోణి

# చిత్రపటముల వివరణము

డాక్టరు చిప్రుకుల శ్రీరాములుగారు:—౧౮౮౬ వ సంవత్సరం జూను నెల ౧౫ వ తేదీని జన్మించిరి. కొంతకాలము హూణభాష నభ్యసించిరి. ౧౯౦౭ సంవత్సరములో వందేమాతరమను గీతమును పాఠశాలలో పాడినందున ప్రధానోపాధ్యాయుడు స్కూలునుండి తీసివేసెను. తరువాత తిరిగి ఆయుర్వేదమందు కొంత పరిశ్రమచేసి తనావిగా దేశసేవకులై సామాన్యజీవనము జేయుచు కొంతకాలము ఉపాధ్యాయవృత్తిలో నుండి మహాత్ముని సందేశము రాగానే ఆవృత్తిని వదలి రేపల్లెతాలూకా కాకనగాలగ్రామములో జాతీయపాఠశాలను స్థాపించి కాంగ్రెసు ప్రచారము చేయుచు మహాత్ముడు చెన్నపురిరాగానే కడప జిల్లాలో వారి నాహ్వానించుటకు రాష్ట్రీయసంఘమువారిచే అచ్చటికి పంపబడి ఆ జిల్లాను నిద్రనుండి మేల్కొల్పి వారిని ప్రత్యేక రైలునందు రప్పించి ౨౫-౫-౧౯౨౧ ఆహ్వానము కాగానే ౨౭-౫-౧౯౨౧ ఆ జిల్లాధికారిచే ౧౦౮ సి. పి. సి. ప్రకారము సమ్మానింపబడి ౧౪-౧౦-౧౯౨౧ నుండి ౧౩-౧౦-౧౯౨౨ వరకు ఒక సంవత్సరము సామాన్యఖైదు చేయుగా సెక్యూరిటీ యియ్యక ధైర్యముగా చెఱసాలకు వెళ్లి అచ్చట అనగా శ్రీ కృష్ణజన్మస్థానములగు రాయవేలూరు, కడలూరు జైళ్లందు విశ్రాంతి పుచ్చుకొనుచు, శ్రీ భగవద్గీతకు పద్యకావ్యమును, రాఘవేంద్రశతకమున్ను శ్రీ కృష్ణజన్మస్థానమను నవలయును వ్రాసి సురక్షితముగా నిల్లుచేరి యేమియు జంకక తిరిగి దేశసేవకు ధైర్యముతో నిలబడి పనిజేయుచున్నారు.

అయ్యంకి వేంకటరమణయ్యగారు:— వీరు బెజవాడ వాస్తవ్యులు. దేశసేవానిరతులు. ఆంధ్రగ్రంథాలయాభివృద్ధికిని చాల భటోద్యమమునకును చాల పనిచేసిరి. గ్రంథాలయపత్రికను ముద్రాలయమును నెలకొల్పిరి. బెజవాడలో రామమోహన గ్రంథాలయమును గూర్చి చాల శ్రద్ధగా పనిచేయుచున్నారు.

బెల్లంకొండ రాఘవరావుగారు:—వీరు నర్సారావుపేట తాలూకా పమిడిపాడు అగ్రహారీకులు. ఆసహాయోద్యమములో అద్భుతముగా పనిచేయుచున్న ధ్యువకులు.

గోగినేని, రంగనాయకులు చౌదరిగారు:—గుంటూరు జిల్లా నిడుబ్రోలుగ్రామవాస్తవ్యులు. వీరు 1920 సం॥ ఆగష్టునెలలో ఇంగ్లాండుదేశము వెళ్లిరి. అచట ఆక్సఫర్డ్ యూనివర్సిటీయందు విద్య నభ్యసించిరి. దేశసేవాకుతూహలులై మేంచెస్టర్ లివర్‌పూల్ మొదలగు పట్టణములకు వెళ్లి రాజకీయ, ఆర్థిక, పారిశ్రామికవిద్యలను చదువుచున్నారు. వీరు కొలదికాలములో మన హిందూదేశము రానున్నారు.

కల్లూరు సుబ్బరాయులుగారు:—వీరు అనంతపుర మండలమున అసహాయోద్యమము ప్రారంభించిన నాటి కడు శ్రద్ధతో పనిచేసి రెండుసార్లు కారాగృహమునకు బోయివచ్చినవారలు. ఇప్పటికిని ప్రజాసేవ జేయుటకు సంసిద్ధులై కాంగ్రెసు ఆదేశానుసారము పనిజేయుచుండువారు.

దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు:—వీరు గోదావరి మండలవాసులు. ఆంధ్రదేశమున వ్యవసాయశాఖలో డిప్యూటి డైరెక్టరుగ నుండి వ్యవసాయ విషయములను తేటతెనుగులో కీర్తనల రూపమున ప్రచురించి రయితుల పురోభివృద్ధికి చాల పాటుపడినవారు. ప్రస్తుతము కోయంబుత్తూరు వ్యవసాయ కళాశాలలో వ్యవసాయశాస్త్రజ్ఞులుగ బనిచేయుచున్నారు.

పత్రి అనంతరావుగారు:—వీరి వయస్సు 21 సంవత్సరములు. కాపురము గుంటూరుజిల్లా సాతులూరు. పొన్నూరులో 141 సెక్షను అతిక్రమించిన 10 మందిలో వీరొకరు. 26-1-22 తారీఖున గుంటూరులో వర్కింగు కమిటీ సభకు వెళ్లినప్పుడు అక్కడ వీరిని అరెస్టుచేసి ఆరాత్రి నర్సారావుపేట తీసికొనివచ్చి 27-1-22 తారీఖున జామీనుకోరగా నియ్యనందున ఒకసంవత్సరము కఠినశిక్షను వీరు పొంది శిక్ష పూర్తిగా అనుభవించి వచ్చినారు.

గంపలగూడెంకుమారరాజా శ్రీ కోటగిరి వెంకటకృష్ణారావుగారు:—శ్రీవారు ఆంధ్రరాష్ట్రమున జమీందారులు. వెలమవారు. వీరు మాతృభాషా పాండిత్యసంపన్నులు. కవిపుంగవులు. నిరుపమానదేశసేవాధురీణులు. అసహాయోద్యమమహానాయకులు. దేశసేవకుగాను ప్రభుత్వ ప్రశంసను బడసి కృష్ణజన్మస్థానమున తప మొనర్చివచ్చి ద్విగుణీకృతోత్సాహముతో మరల దేశసేవ చేయుచున్నారు.

మతం బాలసుబ్రహ్మణ్య గుప్తగారు:—వీరు ఆర్యవైశ్యులు. వీరి నిర్భయస్వభావమును గంభీర వాగ్ధాటియు నిరుపమాన రాజభక్తియు సుప్రసిద్ధములు. వీరు కృష్ణజన్మస్థానమున కేగిరి.

శ్రీ జగన్నాథ భూపతి దేవవర్మగారు:— శ్రీవారు వడ్డాది రాజ్యాధిపతులగు శ్రీ విజయ వీరప్రతాప వీరవర వీర శ్రీ జగన్నాథభూపతి దేవవర్మ మహారాజులుంగారి పౌత్రులు. శ్రీ గోపాల భూపతిదేవవర్మ గారి జ్యేష్ఠపుత్రులు. విశాఖపట్టణముజిల్లా మాడుగుల నివాసులు. వీరికి సంస్కృతము, ఆంధ్రము, ఒరియా, ఉరుదు భాషలలో గొప్ప పాండిత్యముగలదు. జగన్నాథభూపతీయంబను ఆశ్వలక్షణమును, వ్యాయామశాస్త్రమును గద్యరూపమున రచించిరి. వైద్యము, ఆథర్వణవేదము, మంత్రప్రయోగవిధానము, గారుడము, శిల్పశాస్త్రము, ద్వాత్రింశత్ఆయుధప్రయోగపరణి, శాలిశాస్త్రప్రయోగము, అగ్నిబాణవిద్య, మల్లవిద్య, వ్యాయామక్రీడ, మొదలగువిద్యల నభ్యసించిరి. మాడుగుల ఫిర్కా సంఘమునకు వీ రధ్యక్షులు. దేశభక్తుడగు మహావీరుడు ('వారియర్ పేట్రియట్') అని స్వరాజ్యపత్రికచే బహూకరింపబడిరి.

వైద్యరత్న గూడూరు వేంకటశేషకవిగారు: గుంటూరు మండలములోని వేటపాలెం గ్రామవాసులు. వైశ్యబ్రాహ్మణులు. వీరికి ఆయుర్వేదమం దపారమైన పాండిత్యము గలదు. అనేకులు వీరి యౌషధాలయమందు తీఱనివ్యాధులను మాన్పుకొని ఆరోగ్యవంతులయిరి, అగుచుండిరి. మరియు వీరు సుప్రసిద్ధాంధ్రపండితులు. వీరు కొన్ని నాటకముల రచించిరి. వీరి కథాధారణము చాల రసవంతముగ నుండును.

ఇటికాల సూర్యనారాయణగారు:—తెనాలిలో ప్లీడరుగా నుండి, మహాత్ముని సందేశానుసారము 1921 సం॥రపు ప్రారంభ

మందు వృత్తిని వదలివైచి, కాంగ్రెసు ప్రచారము చేయుచుండిరి. పన్నుల నిరాకరణ సందర్భమున 2-2-22 లగాయితు 1-8-22 వరకు జామీను శిక్షక్రింద విడిశైదు విధింపబడిరి. వీరు తెనాలిజాతీయవిద్యాలయమునకు కార్యదర్శిగా నుండి పనిచేయుచున్నారు.

దోమా వేంకటస్వామిగుప్త గారు:—వీరు వైశ్యులు. శతావధానులు. చాల పతకములను బడసిరి.

భట్టిప్రోలు సూర్యప్రకాశరావు గారు:—వీరు అసహాయోద్యమము నవలంబించిన ఆంధ్రప్రముఖులు. ఉద్యమమును గురించి వీరు రాష్ట్రమునందంతటను సంచరించి గంభీరోపన్యాసముల నొసంగి ప్రభుత్వమువారి దృష్టి నాకర్షించి శ్రీకృష్ణజన్మస్థానమున కేగిరి.

శ్రీ కటికనేని కళ్యాణరావుగారు:—వీరు వెలమవారు. జమీందారులు. దేశసేవానిరతులు. అసహాయోద్యమము నవలంబించి దీక్షతో పనిచేయుచున్నారు.

విద్వాన్. కే. శేషశాస్త్రిగారు:—వీరు ఆఱవ ఆంధ్రవైద్యసమ్మేళనాధ్యక్షులు. ఆయుర్వేదరత్న, విద్వాన్. ఎ. వి. ఎస్. గారు. ఆయుర్వేద కళావిభూషణేత్యాది బిరుదములు గలవారు, శృంగేరి.

ప్రొఫెసర్ బెల్లూరి నరసింగరావు హనుమద్భక్త గారు:—వీరు మాధ్వులు. ఈయన బొబ్బిలి హైస్కూలులో వ్యాయామోపాధ్యాయులు. వాయునిరోధముచేసి మహాకష్టసాధ్యము లగు పనులను చూపుదురు. ప్రత్యవయవమును కదలించుశక్తి గలదు. ప్రతి కండరమును వడిపించుశక్తి గలిగియున్నారు.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు:—వీరు తిరుపతి వేంకటకవు లను పేరితో అత్యధికవిఖ్యాతి వహించి తొలుదొలుత ఆంధ్రరాష్ట్రమున తమ నిరర్గళ అమృతధారావాహినిని ప్రవహింపజేసిన కవివృషభులలో నొక్కరు. భారతామ్నాయమునంతను దృశ్యప్రబంధములుగా రచించిరి. పెక్కుగ్రంథరాజముల రచించిరి. కింకవీంద్రఘటాపంచానన నాది పెక్కుబిరుదములను గడించిరి.

కాశీ కృష్ణాచార్యులుగారు:—వీరు మాధ్వ లనబడు సద్వైష్ణవులు. గొప్పవిద్వాంసులు. ఉభయభాషాకోవిదులు. మహాకవులు. పెక్కుగ్రంథములను వ్రాసిరి. శతావధానులు. గుంటూరువాస్తవ్యులు.

కోలాచలం సీతారామయ్యగారు:—వీరు కృష్ణామండలమందలి ఉయ్యూరు గ్రామవాస్తవ్యులు. బ్రాహ్మణులు. పండిత కుటుంబమువారు. మహావ్యాఖ్యాత యని పేరొందిన మహామహోపాధ్యాయ మల్లినాథసూరివంశీయులు. బందరు పాఠశాలయందు మెట్రిక్యులేషను చదివిరి. అనంతరము కొంతకాలము మదనపల్లి కళాశాలయందును, అడయారు జాతీయవిద్యాలయమందును శ్రీమతి అనిబిసెంటమ్మగారి విద్యార్థివేతనముతో బి. యస్. సి అను పట్టమును బడసిరి. పిమ్మట అమెరికా సంయుక్తరాష్ట్రములందలి 'చికాగో' నగర విశ్వవిద్యాలయమున ప్రవేశించిరి. వీరు ప్రవేశించి విద్యాభ్యాసము మొదలుపెట్టిన కొలదిమాసములలోనె, చికాగో నగరమందలి గొప్పగొప్ప దైనికపత్రికలు, వీరి బుద్ధికుశలతను ప్రశంసించినవి.

పులవర్తి వేంకటరాయశర్మగారు:—వీరు అంద్రంగి గ్రామవాస్తవ్యులు. అంద్రంగి గ్రామచరిత్రా గ్రంథకర్తలు. అంద్రంగిస్వవృద్ధి సంఘ కార్యదర్శులు. అంద్రంగి పరపతిసంఘాధ్యక్షులు. శ్రీ వేంకటకృష్ణ పుస్తకభాండాగార కార్యదర్శులు. అంద్రంగి గ్రామ కాంగ్రెసు సంఘ కార్యదర్శులు. శ్రీ గోదావరిజిల్లా కాంగ్రెసుసంఘసభ్యులు. ఆయుర్వేదవైద్యులు.

కళా. వేంకటరావుగారు, బి. ఏ:—(గుజరాతువిద్యాపీఠము) కోన సీమవాస్తవ్యులు. వయస్సు 28. తాలూకాలో వీరికి మంచి గౌరవమును పలుకుబడియు గలవు. చిన్ననాటినుండియు జాతీయోద్యమములో పనిచేసికొనుచున్నారు. విజయనగరములో "స్వసంఘ" కార్యదర్శిగా నుండి చాలపాటుపడి పనిచేసిరి. మ్యునిసిపలు ఎన్నికలలో పాల్గొని మంచి ప్రతిభ గడించిరి. ఆంధ్రవిద్యార్థిమహాసభవారి వక్తృత్వ పోటీలో ప్రథమబహుమతిగా బంగారు పతకము నందిరి. కాంగ్రెసు ఆజ్ఞప్రకారము బందరు నోబిలుకళాశాలనుండి. బి. ఏ. సీనియరు క్లాసు వదలివేసి, నాటినుండియు గోదావరిజిల్లాలో విరివిగా ప్రచారము సల్పిరి. మంచిరాజకీయశాస్త్రపరిజ్ఞానము కలదు. పన్నుల నీయవల దని బోధించినందులకు ఒక సంవత్సరము కఠినశిక్ష ననుభవించి, 16-12-22 తేదిని బయటకు వచ్చిరి. ద్విగుణీకృతోత్సాహముతో తిరిగి పనిచేయుచున్నారు.

అత్మకూరి గోవిందాచార్యులుగారు:—వీరు అసహాయవాదులు. ఆంధ్రప్రముఖులలో నొకరు. పురాణ సంస్కృత విద్యల నభ్యసించిరి. ఆంధ్రవిద్యాపారంగతులు, అవధానులు, పశ్చిమగోదావరిజిల్లాయందు వీరు ప్రబోధము గావింపని పల్లె యొకటియైన లేదు. తాము నిరంతరాయమానముగ రేయింబవళ్లు జిల్లాయందు గావించిన ప్రబోధమునకు ప్రభుత్వమువారిచే నొక సంవత్సరము కఠినశిక్ష. 31-1-1922వ తేదీని బహుమానము పొందిరి. అసామాన్యదేశభక్తివలన అనుపమానాత్మబలసంపత్తితో కారాగారమున ప్రాణాపాయస్థితి నెనిమిదిమాసములు ప్రభుత్వమునకు జామీనొసంగక శయ్యాగతులై రక్తమాంసాదుల నర్పించి శల్యగతప్రాణులై ప్రభుత్వమువారిచే వదలారు చెఱనుండి విడుదలచేయబడినధీరస్వాంతులు. శాంతమూర్తులు. మహాత్మునియందును అసహాయోద్యమమందును వీరికి నిరుపమానగాఢవిశ్వాసము కలదు. వీరు మహాత్ముని యుద్యమమును సక్రమమార్గంబున నడిపింపగల నాయకులు.

కాళ్లకూరి-నృసింహంగారు:— వీరు ఆర్వేలనియోగ బ్రాహ్మణులు. వయసు సుమారు 62. కృష్ణాజిల్లా తిరువూరుతాలూకా కోపల్లెగ్రామవాస్తవ్యులు. 1881లో కరణీకమును ప్రారంభించిరి. వీరి కాంగ్లభాష రాకపోయినను పల్లెటూరివారి అభివృద్ధికై మొదటినుండియు పనిచేయుచున్నారు. తాలూకాలో గ్రంథాలయములను గ్రామసంఘములను 1890 మొదలు స్థాపించి కీ॥ శే॥ గంజాం వేంకటరత్నంపంతులు (కాకినాడ, డాక్టరు బి. పట్టాభిసీతారామయ్యగారి మామగారు) గారిని రాజకీయరంగమునకుదింపి గోదావరీజిల్లాసంఘము నేర్పరచిరి. చాలసార్లు కాంగ్రెసుసభలకు వెళ్లిరి. 30 ఏండ్ల క్రితమే కరణములసంఘము నేర్పరచిరి. వీరు రాజకీయరంగమున పనిచేయగూడదని కలక్టరు వ్రాయగా 1900 సంవత్సరమున కరణీకమును వదలివేసిరి. తదాదిగా నేటివఱకు దేశసేవ చేయుచున్నారు. వీరి కసహాయోద్యమముపట్ల నధికమగు సానుభూతి కలదు.

Printed and Published By K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thumbuchetty Street, G. T. Madras.



Mylapore Ladies' Recreation Club    శ్రీలసధ సాంవత్సరికోత్సవము - మైలాపూరు



శ్రీ క్రియాశక్తి వొడయారు ధర్మగ్రంథాలయము - ధర్మవరము

The Ramakrishna Students' Home, Mylapore



రామకృష్ణవిద్యార్థిగృహము - మైలాపూరు

## సుగుణమణి

కథాభాగ మద్భుతము. కల్పన మత్యాశ్చర్యకరము. చూచి తీరవలసినది. వెల రు 1-8-0

## శృంగారనైషధసారము

కవిసార్వభౌముడగు శ్రీనాథుడు రచించిన నైషధము నను సరించి వచనరూపంబున మనోహరమగు శైలితో ముద్రింప బడినది. ప్రతివారును ముఖ్యముగా జూచి యానందింపవలసిన గ్రంథరాజము. వెల రు 0-12-0

## పౌండరీక మాహాత్మ్యము

శ్రీ తెనాలి రామలింగకవి ప్రణీతమగు పాండురంగ మాహాత్మ్య కథాభాగంబు ననుసరించి వచనంబున సులభశైలితో ముద్రింపబడినది. త్వరపడుడు. వెల రు 0-8-0

## కర్మఫలము

అనన్యములగు కల్పనలతో పాఠకుని విచిత్రతరంగముల సంచరింపజేయుచు యానందము కలిగించు చుండును.

పోస్టుఖర్చులు ప్రత్యేకము. త్వరపడినగాని గ్రంథములు లభింపవు.

విలాసము:— అత్తలూరి సూర్యనారాయణ,
కావురు, గుంటూరుజిల్లా. మద్రాసు ప్రెసిడెన్సీ

---

## పట్టుజరీఖీరకములలో

పురమాషీగా తయారుచేయబడిన చీరలు, రవికెలు, ధావణీలు, పావడలు, ధోవతులు, పైన వేసుకొను గుడ్డలు, రుమాళ్లు, కోటింగులు, షర్టులు, నారమడి పట్టుగుడ్డలు మొదలగువాటిలో

# యేది కావలసినను
# మా షాపుకేరండి
లేక
# టెలిఫోను చేయుడు

# కె. ఎస్. ముత్తయ్య అండు కంపెనీ

# సిల్కు హౌసు,

188, గోవిందప్పనాయక వీధి,

ఫోను నెంబరు, 1216. మద్రాసు.

---

## POLLUTION RING!

Involuntary Noctornal Emmissions and Seminal discharges, the preludes to other serious troubles like Spermatorrhoea, Loss of manhood and Impotency, effectively checked and stopped for ever by our recently imported scientific mechanical device. German manufacture, the "Pollution Ring" priced at Rupees Five only, packing and postage charges extra.

No drugging necessary, Lasts a life time. Full directions of use accompany. Order now, ere the disease ripens, from :—

Rai B. S. BHANDARI, M. A. (A. P. A.)
Batala (Punjab).

---

# అమృతాంజనము

జగత్ప్రసిద్ధి జెందిన దివ్యాంజనము

తలనొప్పుల మాన్పును వాపుల రూపుమాపును దురదను తగ్గించును లక్షోపలక్షలు విక్రయము అన్నిచోటులలోను విక్రయింపబడును. చక్కని డబ్బీలో వెల 10 అణాలు మాత్రమే.

అమృతాంజనం డిపో, 6 తంబుచెట్టివీధి, మద్రాసు.

---

## సిద్ధమకరధ్వజ

ఇందు బంగారు, ముత్యము, వెండి, అభ్రకాది భస్మములు చేర్చి తయారుచేయబడి యున్నది. ఇది సమస్తవ్యాధులను ఆద్భుతముగా ఖండించును. ప్రమేహము, క్షయ, పాండువు, శ్వాసకాసలు, అగ్నిమాంద్యము, సమస్తవిధములగు జ్వరములు, జీర్ణజ్వరములు, పురాణజ్వరములు, దగ్గులు, అరుచి, అగ్నిమాంద్యము, అమ్లపిత్తము, కృశత్వము, శిరశ్శూలము, అజీర్ణము, అతిమూత్రము, దుర్బలత్వము, శుక్లనష్టము, స్త్రీల కుసుమవ్యాధులు, మొదలగువాటిని ఖండించును. రక్తమును శుద్ధపరచి వృద్ధి బొందించును. మిక్కిలి వీర్యవృద్ధిని, సంభోగశక్తిని, బలమును, కాంతిని, కాయసుఖమును, సంతానప్రాప్తిని, కలిగించు వరప్రసాదము. దీనిని శ్రీమంతులు సదా తాంబూలములో సేవించుచుండిన సర్వరోగవినిర్ముక్తులై సర్వసుఖము ననుభవించెదరు. వెల మిక్కిల స్వల్పము. తులం 1-కి రు 24-0-0. 20 మాత్రలు సీసా 5-0-0 లు వి. పి. ఖర్చులు ప్రత్యేకము.

అన్ని ఔషధముల క్యాటలాగు ఉచితము.

# పి. శి. ఏ. అండు కంపెని,

ఆయుర్వేదసమాజము,
9 పెదరేవు - నెల్లూరుజిల్లా.

# Ground-Nut Decorticator or Opener

## గ్రౌండునట్ డెకార్టికేటరు లేక ఓపనర్



యంత్రసహాయముచే నడుపబడును. ఏ. బి. సి. అను మూడు రకములు మెషినులు గలవు. ఇవి 80, 100, 120 మూటల గింజలను 12 గంటలలో తయారు చేయుగలవు. గ్రౌండునట్ డెకార్టికేటరులు లేక ఓపనరులు తత్క్షణమే యిచ్చుటకు సిద్ధముగా నున్నవి. చెన్న రాజధాని, బొంబాయి రాజధానిలో నున్నట్టి వర్తకులకు ఇదివరలోనే వేరుశెనగ కాయల నుండి గింజలను విడదీయునట్టి 1000 మెషినులను సరఫరా చేసియున్నాము. మా గ్రౌండునట్ డెకొరేటరులు ప్రస్తుతము చెన్న రాజధానిలో మద్రాసు, మైసూరు, తిరుచినాపల్లి, తంజావూరు, సేలము, ఈరోడ్డు, పొల్లాచి, తిరుపూరు, కోయంబుత్తూరు, ఆరణి, పోళూరు, మధుర, తిరుకోవిలూరు, తిరుపత్తూరు, ధర్మపురి, విజయనగరము, బొబ్బిలి, పల్లము, బూదలూరు, ఆర్కాటు, కర్నూలు, కడప, హిందూపూరు, నంద్యాల, గుత్తి, ఎఱ్ఱగుంట్ల, ప్రొద్దుటూరు, కొండాపురము, గుంతకల్, కదిరి, తాడిపత్రి, తుమకూరు, దేవన్‌గిరి మొదలగు స్థలములలోను, బొంబాయి రాజధానిలో బొంబాయి, పూనా, కొల్హాపురము, శంగ్లి, కారడ్, బెల్‌గామ్, గుజరత్, పోర్‌బందరు, జామ్‌నగర్, ధూలియ, జల్‌గేయాన్, నవ్‌సరి, పాచోర, చాలిస్‌గేయాన్, కొపెగెయాన్, రహిమత్‌పూరు మొదలగు జాగాలయందు ప్రస్తుతము వాడుకలో నున్నవి.

☞ చిత్ర విచిత్రపు క్యాటలాగునకు ఈ దిగువ విలాసమునకు వ్రాసిన పంపబడును.

| భైడ్ అండు సన్సు<br>శంగ్లి. ఎస్. ఎమ్. సి. | Bhide & Sons<br>Sangli. S. m. C. |
|---|---|

# ఈకంపెనీలో ఎన్ని వాటాలు కొంటిరి? ఏమి! ఇంకను ఏమియుకొనలేదా!!

100 కి 25 కు పైగా లాభమువచ్చును-నిర్భయముగా వాటాలను కొనవచ్చును. స్వయముగా వాటాలకు దరఖాస్తు చేసినయెడల, కంపెనీభాగస్వాములకు అనగా మాకును కమీషనుఖర్చులు మిగిల్చి లాభముచేసినవా రగుదురు.

## ది బెజవాడ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్స్, లిమిటెడ్, బెజవాడ

మూలధనము రు 20,00,000 వాటా 1-కి రు 20 వం॥ 1,00,000 వాటాలు

ఇప్పటివరకును 1,30,740 లు విలువగల 6537 వాటాలుమాత్రమే కొనబడి రు 48,015 లు వసూలైనవి.

దరఖాస్తుతో రు 5 లు. అల్లాటుమెంటు అయినపిదప రు 5 లు

మిగతవి మూడుమాసములకు తక్కువకాని రెండువాయిదాలలో వసూలు చేయబడును.

డైరక్టర్లు:—మిక్కిలి ధనవంతులును వర్తకవ్యాపారములందు మంచి అనుభవము కలవారును యున్నారు.

1. దివాన్‌బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు, వర్తకులు-కాకినాడ.
2. రావుబహద్దరు చింతలపాటి వెంకటసూర్యనరసింహరాజుగారు, బి. ఏ. బి. యల్. విశాఖపట్టణము.
3. శ్రీరాజా వెంకటరామయ్య అప్పారావుబహద్దర్ గారు జమీందార్ ఆఫ్ మిర్జాపూరు, నూజవీడు
4. గూడూరి లక్ష్మణరావుగారు బి. ఏ. ల్యాండ్‌హోల్డర్, బెజవాడ.
5. చుండూరి సీతారామయ్యగారు, మర్చెంట్ అండ్ మిల్ ఓనర్ బెజవాడ.
6. గోళ్ల నారాయణరావుగారు, మర్చెంట్ అండ్ మిల్ ఓనర్, బెజవాడ.
7. చాపరాల వీరయ్యగారు, ల్యాండ్‌హోల్డర్, కంట్రాక్టరు అండ్ జనరల్ మర్చెంటు, బెజవాడ.

మేనేజిమెంటు:—మేనేజింగు డైరక్టరు 60,000 రూపాయిల షేర్లనుకొని పనిసాగువరకు యుచితముగ పనిచేయుటకు పూనుకొనియున్నారు. మిక్కిలి అవసరమైన ఖర్చులకుమాత్రమే కంపెనీసొమ్ము వాడబడుచున్నది. మిక్కిలినేర్పుతో అన్నిపనులు వ్యవహరించబడును.

స్థలము:—మిల్లుకట్టుకట్టుటకు కృష్ణా కెనాల్ స్టేషనువద్ద సర్కారు స్థలమునకు దరఖాస్తు చేయబడినది. స్థలము స్వాధీనపడినతోడనే మిల్లుకట్టుట ప్రారంభమగును. ప్లానులు తయారై సిద్ధముగ యున్నవి. యీనెలాఖరులోపల యంత్రములకు ఆర్డరు పంపుచున్నాము.

లాభములు:—మిల్లు యిచ్చట కట్టుటవల్ల అనేక లాభములున్నవి. పెద్ద, చిన్న, రైల్వేలైనులు మిల్లులోనికి స్వల్పవ్యయముతో వచ్చును. మంచినీరు కాలువలలోను, నూతులలోను సమృద్ధిగ కలదు. బొగ్గు శింగరేణి గనులనుంచి అతిచవుకగా దొరుకును. ప్రత్తిపండెడు ప్రదేశములకు మధ్యగానున్నది. నేర్పరులగుపనివాండ్రు కూలీలు అతిచవుకగా దొరుకుదురు. రాయి, సున్నము, యిసుక వగైరాలు మిల్లుకట్టెడు స్థలసమీపముననే యున్నవి.

ఈ కారణములచేత మన రాజధానియందుండు మిగత మిల్లులకంటె దీనికి యెక్కువలాభము తప్పక రాగలదు.

పని:—15,000 కదుళ్లతోను 200 మగ్గములతోను పనిచేయుటకు నిర్దేశింపబడినది. వసూలైనసొమ్ము వృథాగా యుండకుండ వెంటనే 100 మగ్గములలో బట్టలనేత ప్రారంభించుటకు డైరక్టర్లు తీర్మానించియున్నారు. గనుక పని త్వరలో ప్రారంభించబడును. ఇదిగాక ముందుముందు యీమిల్లు ఇండియా దేశపుమిల్లు లన్నిటికంటెను పెద్దదిగాయగుట కనేకయవకాశము లున్నవి. వెంటనే వాటాలకు దరఖాస్తుపంపి లాభమునుపొంది యీ స్వదేశోద్యమమును నెరవేర్పవలెను. స్వరాజ్యము మనదేశపరిశ్రమల యభివృద్ధిలోనే యున్నది.

సొమ్ము ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, బెజవాడ, గాని ఇండియన్ బ్యాంక్, లిమిటెడ్, మద్రాసు. లోగాని కట్టవచ్చును. లేదా మేనేజింగు ఏజంట్లకు ప్రత్యేకముగా పంపవచ్చును.

దరఖాస్తుఫారములు, ప్రాస్పెక్టసులు యింకా యితరసంజాయిషీ యీదిగువవారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

గూడూరి లక్ష్మణరావు, మేనేజింగు యేజంటు అండ్ డైరక్టరు, బెజవాడ.

# మీ బిడ్డ పాఠశాలలో ఆరోగ్యముగా నున్నదా?

తమ బిడ్డలు బుద్ధి, సామర్థ్యములందు అభివృద్ధి గావలె నని యెట్లు తల్లి తండ్రులు కోరు చున్నారో ఆ ప్రకారమే ప్రతి మానవుడును తమ బిడ్డలు అంగలోపము లేక ఆరోగ్యముతో నుండ వలె నని వారు స్వభావసిద్ధముగా కోరెదరు.




అయితే నిజముగా ఎందరు తల్లి తండ్రులు తమ బిడ్డలకు దేహమునందు ఏలాటి లోపము లేక నుండవలె నని గ్రహించియున్నారు?

నాగరికత బడసిన ప్రపంచమునందు మునుపటికంటెను ఇక మునుపు ఈ విషయమై విశేషశ్రద్ధ వహించవలెను. అంగహీనము లేనట్టియు, ఆరోగ్యకరమైనట్టియు పిల్లలను పెంచునప్పుడే నిజముగా మంచి కాలము ఆసన్న మగుచున్నది. ఈ ఉద్యమమునందు తల్లితండ్రులు, పోషకులు తప్పక శ్రద్ధపుచ్చుకొని, వారి పిల్లలను అలక్ష్యము చేయకూడదు. వారి పిల్లలందు లోపము లేవైన యున్నవా గ్రహించవలెను గనుక మీ పిల్లలు అంగవిహీనముచే బాధపడునప్పుడు తక్షణమే మీ వైద్యుని సలహా పొంది, తక్షణమే అట్టివారిని మా ప్రతిష్ఠాలయమునకు పంపకోరెదము. లేక వ్యాధి అభివృద్ధి గాకుండుటకై మాతో ఉత్తర ప్రత్యుత్తరములను నడపి మా సలహాను పొందుడు ఇట్టివి నూరులకొలది మాచే బాగుచేయబడుచుండుటను మీరు చూడగోరినచో ఒకసారి దయచేసి మా ప్రతిష్ఠాలయమునకు తప్పక రా గోరెదము.

మా పద్ధతులు మీకు బాగుగా బోధపడునట్లు విపులముగా తెలుపబడును. మిక్కిలి శాస్త్రోక్తమైనట్టియు, ప్రస్తుత కాలమునకు తగినట్టి పద్ధతుల ననుసరించియే నిజమైన మానవసేవ చేయబడుచున్నదని మీరు గ్రహించగలరు.

## సేవాసదన సంఘమువారి ఏడవ సాంవత్సరిక నివేదిక
## మేమి చెప్పుచున్నదో చదివి చూడుడు!

కత్తియవార్ క్షామబాధక మండలమునుండి మూడేడ్లక్రిందట తీసికొని రాబడి, శరణాలయమున నుంచబడిన నాలుగు సంవత్సరముల ప్రాయములు గల నిస్సత్తువ బాలిక లిద్దరికి ఎన్. పావలు కంపెనివారు ఉచితముగా చికిత్స చేసినందులకు మా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాము. ఇంతకుముం దేమాత్రము నేలమీద అడుగుపెట్టజాలని యా బాలికలు ఈ మహనీయుల చికిత్సవలన సులువుగ నడచుచున్నారు.

**N. Powell & Co, Bombay.**